శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

నే భగవంతుండనియు, అస్మదీయ శరణం బభ్యర్థించు మహాభక్తులకే ననిశము మోక్ష మొసంగుదుననియు లోకంబున జాటెను.

శ్రీరామచంద్రుడు దుష్టశిక్షణ, శిష్టజనరక్షణ మొనర్చి ధర్మ సంస్థాపన నొనర్పక "ఆత్మానం మానుషం మన్యే" యని నుడువుచు భగవంతుండు వైకుంఠ నగరనము విరాజిల్లౌననియు నద్దేవ దేవుని భజియించి మోక్షము పొందుండని జాటెను.

శ్రీరామచంద్రుడు నిజావతార రహస్యము గుప్తమొనర్చెను. తాను కేవల మానవరీతిని వర్తించెను. శ్రీకృష్ణభగవానులు తానే లోకనాథుండనె. తన యవతార రహస్యము లోకమునకు జాటెను. శ్రీరామావతారము పూర్ణావతారము, శ్రీకృష్ణావతార మంశావతారము.

శ్రీరామ, శ్రీకృష్ణ లీలావతారముల కియ్యదియ యంతరము.

ఓం తత్సత్.

హరేరామ హరేరామ రామరామ హరేహరే!
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే!





## —: శ్రీరామ శ్రీకృష్ణనామ మహిమ :—

గీ|| "కృతయుగంబున ధ్యానంబు, త్రేతయందు
యజ్ఞములు, ద్వాపరంబున నర్చన బు
గలుగఁ జేయంగఁ గలవో యేఫలమునదియె
కలుగు హరికీర్తనంబుచేఁ గలియుగమున."

తా॥ శ్రీప్రదమగు భగవన్నామమును స్మరించుటవలన కలియుగమున ముక్తి నొందవచ్చును.

యజ్ఞములు చేయుటచే త్రేతాయుగమునందును, అర్చనలు సలుపుటచే ద్వాపరయుగమునందును కలుగు ఫలమేమి గలదో ఆ ఫలము హరినామ కీర్తనముచే కలియుగమునందు గలుగును.

క|| హరిహరియని జపియించిన।
సరగునను సమస్త మంత్రజపఫలమొదవున్
హరినామ జపంబునకున్
సరియైన జపంబులేదు జగములయందున్.

క|| హరినామ మహామంత్రము
దురితపిశాచమును బారద్రోలును దుర్గతిలోఁ
బరమంత్రము లద్దానికి
సరిగా వేవియును నెంచ తత్త్వంబున్నన్.

కం|| హరిప్రతిమారూపము ను
దరిసించినవాఁడు మిగుల ధన్యుఁడు హరిపై
సరసమగునట్టి కావ్యము
విరచించినవాడు జన్మవిరహితుఁడు సుండీ.

క|| హరికంటె హరుని వేరుగఁ
బరికించెడివారు నరకపతితులగుచు దు
ర్భర యాతనలను గుడుతురు
హరిహరులందొకఁడుగూడ నరయఁడు వారిన్

క|| హరిపాదాంబువుఁ గ్రోలిన
హరిగుణముల నెంచుకొన్న హరికథ విన్నన్
హరినామము పేర్కొన్నను
హరిఁగన్నను ముక్తి కరతలామలక మగున్.

ఆ|| వె|| రామ రామయని విరామంబులేకుండ
జపముఁ జేసెనేని శ్వపచుఁడైన
పూతుఁడగుచుఁ దాను బూతంబుఁ గావించు
వసుధనెల్ల నిజనివాసమునను.

గీ|| ఎట్టి యపరాధియైనను నెట్టి హీన
జాతియైనను నెట్టి పాషండుఁడైన
నశుచియైనను శుచియైన నార్తుడైన
ధన్యుఁడగు విష్ణు నామంబుఁ దలచె నేని.

గీ|| బ్రహ్మహత్యాది కోటిపాపములు గూడ
నాశనముజెందు గోవింద నామమునను
భస్మమైపోదె యగ్ని సంపర్కమునను
గిరి సన్నిభమగు తూలరాశియైన.

క|| స్మరియించిన మాత్రమున నె
హరినామము నెట్టిమంత్రమైనను జెందున్
బరిశుద్ధుని బాహ్యాభ్యం
తరములయందును నవారతంబును వింటే..

ఆ|| ల|| కృష్ణ కృష్ణ యనుచు కీర్తించువారల
కడకుఁ జేరలేక కలివడంకుఁ
గాన నెట్టి పాపకర్మల కేనియు
దిక్కు కృష్ణనామధేయ మొకటి.

క|| కరతాళము లానరించుచు
హరి యెదుటను బాటపాడునట్టి నరుని దు
ర్భర పాతకౌఘ మెల్లను
గరతాడితమైనరీతిఁ గడకున్ బోవున్.

క|| ఘోరములగు పాపములను
మారణ మొనరించునట్టి మంత్రమన నమో
నారాయణాయయనియెడి
భారతియొక్కటియె యేల బహుభాషణముల్.

క|| అట్టి విష్ణుదశావ తారాహ్వయములు
కీర్తితములైనయెడ సర్వ కిల్బిషములు
జ్వాలనమందుంపఁబడిన కాష్ఠములువోలె
భస్మమైపోయి చేకూరుఁ బరమ పదము.

గీ|| కృష్ణనామ రసాయనం బెల్ల కడల
దొరకుచుండంగ భవమునఁ దొరగి దాని
మునుగుచుందురు! సతతంబు మూఢమతులు
జనన మరణ ప్రవాహోర్మి చయమునందు.

గీ॥ సత్యమును జెప్పుచున్నాఁడ జాటి నేను
సకలపాపములనుగూడ సమయఁజేసి
నరకమునఁ బడనీయక నరుల విష్ణు
ధామమున నిల్పునది హరినామ మొకటె. (ఆం. ప. పు)

రామ రామ రామ రామ, రామరామ యంచు శ్రీ
రామ రామ రామ రామ- రామ రామ యంచు శ్రీ
రామ రామ రామ రామ, రామ రామ యంచుఁ ద
న్నామ కీర్తనంబుజేసి, నంగలుంగు మోక్షమున్.

శ్లో॥ త్రిషట్కాని చనామాని పఠేద్రామస్య యోనరః
తత్రయోపాధి రహితః మోక్షం సమధిగచ్ఛతి.

అని రామమంత్రి ప్రభావదర్పణ మందుండుటవలన శ్రీరామ శ్రీరామ శ్రీరామ అని పదునెనిమిది మారులు శ్రీరామ నామస్మరణ చేసెనేని క్రమముగా స్థూల సూక్ష్మ కారణోపాధులునశించి ఉపాధి త్రయాతీత పరబ్రహ్మ మాత్రుడై ఉండునని తెలియుము.

శ్రీ పార్వతీదేవికి పరమేశ్వరుడు ఉపదేశించినది. మానవ జన్మ మెత్తినందుకు సార్థకమును సంపాదించుకొనుడు.

శ్లో॥ శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే।
సహస్రనామ తత్తుల్యం రామ నామ వరాననే॥

ఇందలి ముఖ్యార్థము శ్రీరామరామరామ శ్రీ ఇహ పరసాధన బీజము. వర్గవిచక్షణపరికారము రా 2 మ 5 రెండును

5 చే హెచ్చింపగ రెండైదులు పది. మొదటి రామ పది రెండవ రామకు పది పదులు నూరు. మూడవ రామకు నూరు పదులు వెయ్యి లేక సహస్రము,

సంఖ్యాయోగప్రకారము $2 \times 5 = 10 \times 10 = 100 \times 10 = 1000$ యీవిధము ఆంధ్రవాల్మీకివారి వలన తెలుకొన్న మార్గము.

ఓపార్వతీ! ఎన్ని విధముల విచారించినను మోక్షమును పొందుటకు శ్రీరామ మంత్రిజపము కంటె మేలయిన యుక్తి వేఱొక్కటి భూమిలో లేదు. ఇదే నిరపాయమైన యుపాయము అని తెలియుము.

నిత్యానంద స్వరూపుడైన పరమశివుడు, ఓ పార్వతీ! నేను "శ్రీరామ! శ్రీరామ! శ్రీరామ! అని జపించుచు ఆ శ్రీరామునియందే జ్ఞప్తి కలిగియుందును. ఆ రామ నామమును ఒక్కసారి స్మరించిన విష్ణుకృష్ణాది సహస్రినామములను అన్నియు పఠించిన ఫలము గలుగును గనుక ఆ శ్రీరామ మంత్రిమును నీ మనస్సున నిలుపుము. అన్ని మంత్రములకంటె శ్రేష్ఠమయిన యీ శ్రీరామమంత్రము బ్రహ్మ - విష్ణు - రుద్ర - మహేశ్వర సదాశివులనెడు పంచకర్తల సృష్టికర్తల సృష్టి, స్థితి, లయ, తిరోధాన అనుగ్రిహములకు ముఖ్యకారణమును, సర్వాతిశయమును, అయిన తారకబ్రహ్మమును, తెలియ వేయునదియును, పవిత్రమైన వస్తువులలో మిగుల పవిత్రిమైనదియును. తనమహిమను సంతోషించినవారికి ధర్మ కామమో

ర్థములను ఇచ్చునదియును నై యున్నదని తెలియుము. మరియూ సచ్చిదానంద స్వరూపమై కూటస్థుని కంటె వేఱుగాని పరమాత్మయందు బ్రహ్మ విష్ణు రుద్ర వ్యాస వసిష్ఠాది బ్రహ్మవేత్తల మనస్సులు ఎల్లప్పుడును లీనమయి యుండుటచేత ప్రకృత్యతీతమయిన ఆ పరబ్రహ్మమునకు రామనామము గలిగెను.

శ్రీరాము డను పేరుగలవాడు అహం శబ్ద (నేను) లక్ష్యార్థ పరబ్రహ్మ మయిన శ్రీమన్నారాయణమూర్తియే సుమీ! ఆ శ్రీమన్నారాయణమూర్తికిని నాకును భేదము లేనే లేదు. మేము "ఏకమే వాద్వితీయం బ్రహ్మ" అను శ్రుత్యర్థమువలన రెండవది లేని పరమాత్మ స్వరూపులము గనుక అద్వయ బ్రహ్మమయుండైన నాయందే నేను క్రీడించుచుందును. ఓంకారమునకు లక్ష్యార్థమును మహాపరిశుద్ధమును అయిన శ్రీరామమంత్రము ఎంతటి పాపమునైనను నశింపజేయును. శ్రీరామనామ మహిమను పొగడ నాకు శక్యముగాదు. పదునాల్గు లోకములలో శ్రీరామమంత్రముచేత నశింపజేయబడని మహాపాపము వెదకిచూచినను లేదని శ్రీ సాంబమూర్తి పలికెను. మరియు శ్రీ రామమంత్రము కోరిన కోరికలనన్నిటిని భక్తులకు హెచ్చుగ నిచ్చుచుండగా కల్పవృక్షమును కామధేనువును చింతామణియును చూచి చిన్నపోయి సిగ్గుపడుచుండును. ఈ సంగతి మూఢు లెఱుంగక భంగపడి అంగలార్చుచు ఆ శ్రీరామరూపమును పూజించుచు ధ్యానించుచు, ఆ శ్రీరాముని పవిత్ర చరిత్రములను వినుచుండెడి బుద్ధిశీలురు అష్టభోగములు

మొదలగువానిని పొంది సుఖించుచుందురు. (సీతారామాంజనేయము).

శ్లో॥ హరేర్నామైవ నామైవ నామైవ భవభేషజమ్
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా॥

హరినామౌషధము సేవించనివారికి భవరోగ మెన్నటికిని పోదు. కలియుగమందింతకంటె సాధనము మున్నాటికిని వేఱుగ లేదు. సంసార తరణోపాయము కావలెనవిన హరినామమునేడి నొకనాశ్రయింపవలెను. ఘోరమగు కలియుగమునందు హరినామము నత్యంతాసక్తితో స్మరించువారు సకలపాపముల నుండి విడువఁబడి యుత్తమగతి నొందుదురు. కాన హరినామమే శరణ్యము. కలికాలమునకు సాటియైన యుగము లేదు. కారణమేమన నామ స్మరణముచేతను, కీర్తనముచేతను విష్ణుస్థానము పొందబడుచున్నది. కృష్ణ కృష్ణ కృష్ణ యను మూనామములు నిత్యమును జపించుచున్నచో బదివేలయజ్ఞములు చేసిన ఫలమును కోటి తీర్థములు సేవించిన ఫలమును లభించును. కృష్ణనామములు మూఁడును కలిపి నిత్యము నే మానవుడు జపించుచుండునో కలియుగములో వానికిఁ గృష్ణునియందు భక్తి యధికమగుచుండును, (స్కా. పు) మూఁడు కృష్ణమంత్రములు కలిపి జాగ్రత్తునను, స్వప్నమునను బఠించువాడు కలియుగమునఁ గృష్ణరూపమును బొందుచున్నాడు. నారాయణ యను మంత్రముండగా సులభముగఁ బలుకుటకు వాగింద్రియము కలుగగాఁ బలుకక మానవులు ఘోరనరకమును బొందుచున్నారు. ఇంత

కన్న నాశ్చర్య మేమి కలదు. రామచంద్ర యను మంత్ర మున్నది. వశమైన వాగింద్రియము కలదు. హరిచరణములు సేవించనివాడు ముక్తిని గనలేడు. హరిహరులకు భేధము లేదు. వారిని వేరుగా తలంపకూడదు. అట్లు తలంచిన హరిహరులం దొకడుగూడ వారి మొర లాలకించరు, తనకంటెను తననామ మున అధికమైన శక్తి పురుషోత్తము డుంచినందున విష్ణునామ మునకు సమమైన దేదియు లేదు.

భగవన్నామమనగాఁ బుణ్యముల గని, దాని నుండి సుకృతి మెంతయో తీసుకొనవచ్చును. భగవన్నామ మెంత యెక్కువగా స్మరించునో అంత యెక్కువగాఁ బుణ్యము లభిం చును. ఆగనికి దరుగుటయన్న దుండదు. భగవానుని మర్కట కిశోరన్యాయముగ సేవించినచో మార్జాల కిశోరన్యాయముగ నాతడు మనలను దరింపజేయును. కావున భగవన్నామము నెల్లప్పుడు స్మరించుట యలవాటు జేసికొనవలెను. తుమ్మినను దగ్గినను నావులించినను గూర్చుండినను నడుచుచున్నను భగవ న్నామము స్మరించుచుండినచో నభ్యాసవశమున నంత్యకాలము నందుఁగూడ నా నామస్మరణము చేయగలుగును. మరణకాల మం దేబుద్ధి పుట్టునో యాగతియే సంభవించును. ఆ స్మరణ ముత్తరజన్మమునకు బీజమగును. ఉదా॥ జడభరతుడు.

భగవన్నామమనగా నొక మంత్రము. ఆ మంత్రశక్తిచే బాపబీజములు నశించును. భగవన్నామసంస్మరణముచే సర్వ

పాపములు తొలగును, ఉదా॥ అజామిళుడు. తెలిసికాని తెలియకకాని వాసుదేవుని గీర్తించినచో నీటిలోఁబడిన లవణము వలె నా నరుని పాపము లయమగును. గోవింద యను నామ మొకసారి స్మరింపబడినను నూరుజన్మములనుండి సంపాదింపబడిన నరునిపాప మగ్నిచేఁ గాల్పబడు దూదిరాశివలె వేగముగా దహింపబడును. తెలియక త్రొక్కినను నిప్పుకాల్చునట్లు హరి యను నామము దుష్టచిత్తముతో స్మరింపబడినను బాపముల బోగొట్టును. మరణ సమయమున భగవన్నామోచ్చారణ మొనర్పఁగలుగు టెంతటి యదృష్టమో కదా ! అవి పోవలెనన్న భగవత్సేవ, భగవన్నామస్మరణ సంకీర్తనలు చేయుటముఖ్యము.

మానవు డనేక జన్మలలో ననేకవిధములగు పాపములు చేయును. వానిలో గొన్నింటికిఁ బ్రాయశ్చిత్తము జేసికొనును. మఱల పాపము జేయును. అందుచే బాపబీజములు మనస్సు నాశ్రయించుకొని యుండును.

శరీరము :- ఈ శరీర మెట్టిది ? స్థిరమగునదియా ? అస్థిరమైనదియా ? ఈ శరీరముతోఁ బరిశ్రమించి సంపాదించిన ధనధాన్యాదులుగాని భోగభాగ్యములుగాని మరణించినపుడు వెంట వచ్చునా ? శరీరము మలమూత్ర భూయిష్టమైన రక్తమాంసములతో నెముకలతోఁ జర్మముతోఁ గూడియున్నది. నాల్గు గడియలు శరీరము శుభ్రముచేయక పోయినను రోతగల్గును. అట్టి దేహమున నేదియో సౌందర్యమున్నదని కొందఱు మోహ

మున బడుచున్నారు. శుక్ల శోణితములవలన నేర్పడినది. మల మూత్రములకు స్థానమైనది. పై నెంత బాగుచేసినను లోపల నశుద్ధమైనదయే. పంచగవ్యములు ప్రవేశింప ఐనను శరీములో బ్రవేశించగనే యవి యపవిత్రములగుచున్నవి. పవిత్రమగు హావిస్సుగూడ నీ దేహములో బడగానే యపవిత్రమగుచున్నది.

ఈ శరీరమునకు నవద్వారములున్నవి. ఈ ద్వారము లన్నింటినుండియు నపవిత్రమయినవే వచ్చుచున్నవి. బొగ్గు నెంతగా నఱుగఁ దీసినను దెలుపురాదుగదా? అటులనే శరీరమునకు లోపల వెలుపల నంతయు నపవిత్రమే. కొండ మీఁదనుండి జలధార ప్రవహించునట్లు శరీరమునుండి కఫము, మలము, మూత్రము మొదలగునవి ప్రహించుచుండును. ఎల్లయు పవిత్రపదార్థములకు నిధియైనదీ దేహము. మలకుంభమువలె మూత్ర కుంభమువలె నుండును. తన మూత్రము తన మలము తాను దాకినచో నసహ్యపడి వెంటనే మట్టి మున్నగు వానిచే శుద్ధి చేసికొనును. అత్తరువు, పన్నీరు పూసికొని పుష్పము లలంకరించుకొని తృప్తిపడును. అంతమాత్రమున నాయప విత్రత పోవునా? నల్లని జంతువున కెన్ని చేసినను దెల్లదనము రానట్లే ఎన్ని పర్యాయములు కడిగిన నీ దేహమునకుఁ బావి త్రము రాదు. అపవిత్రమే. ముక్కులనుండి చెవులనుండియు మలములే స్రవించుచుండును. లోనుండి బయటకు వచ్చునవి యన్నియు మలినములేకాని శుభ్రమైన వేవియు లేవు. అట్టి మలములకు నిలయమైన శరీరమని యెఱింగియు మాయక్రమ్మి

యున్న వాడగుటచే మానవుడు వైరాగ్యమునుబొందుటలేదు. అభిమానమును బెంచుకొనుచున్నాడు. దేహమందలి దుర్గంధమును జూచిః మలమునుజూచి రోతపడునేగాని వైరాగ్యము నందఁడు.

దేహముకంటె రోతయగునదీ ప్రపంచములో నింకేదియుఁ గనిపించటలేదు. మట్టితో నెన్నిసార్లు కడిగినను బరిశుద్ధము కాదు జ్ఞానమనెడి యుదకముతో నంతఃకరణమును గడుగవలెను. అప్పుడు పవిత్రుఁడు. శుద్ధుడగును. ఇట్టి భోగసాధనమనెడి భావమును వీడి ముక్తి సాధన మగునదియను భావము నందవలెను. అప్పుడు జ్ఞానియై సంసార సాగరమునుఁ దరించి ముక్తిని బొందును అరటిచెట్టునకు బొరలవలె దేనికది తీసివేసినచో నిస్సారమిూ శరీరము. అనేక అనకజన్మములలోఁ జేసిన పాపకర్మముల వలన దనకుదాను ద్రోహమొనర్చికొను బుద్ధి గలుగుచున్నది. "మమేతి పరమం దుఃఖం నమమేతి పరం సుఖం" మమకార (నాదియను భావము) ముండుటయే మహాదుఃఖము. మమకారము లేకపోవుటయే పరమసుఖము. కొందఱు చక్రవర్తులు మహారాజులు హరిశ్చంద్రుఁడు, నలుడు, పురుకుత్సుడు,పురూరవుడు, సగరచక్రవర్తి, కార్తవీర్యార్జునుడు, జనకమహారాజు మొదలగువారు తాము భోగముల కొఱకు బుట్టలేదని తలంచి రాజ్యాదులందు మమకారములేనివారై తరించిరి.

గర్భములో నున్నపుడు జీవునకు వైరాగ్యము కలుగును. కాని భూమిమీద బడుసరికి మోహమావరించి పూర్వజ్ఞాన మంతయు బోవును. భూమిపై బుట్టగనే గతజన్మల స్మృతియుం డదు. అందుచే నీ దేహముపై బ్రేమ బయలుదేరును. తనకు దరణోపాయ మేదియో తెలిసికొనక మానవుడు మోహమున బడి సంచరించుచుండును. గర్భములోగల్గిన జ్ఞానమును నాతని పాపకర్మ నిలువకుండ జేయును. పరమేశ్వరుడు చక్కగ ధర్మార్థ కామ మోక్షములు గలుగు మార్గమునుం దెలుపుచుండగా దానిని వినని వానిగతి యధోగతియే. యౌవనము గడచి వార్థకము వచ్చినచో నంతయు దుఃఖమే. శరీరమంతయు ముడుతలు పడును. చేతులు, కాళ్ళు నాడవు. ఏపనిజేయుటకు శక్తియుం డదు. అప్పుడైనను వైరాగ్యము కలుగదు. భార్య, కుమారులు, మనుమలు విసుగుకొని తిట్టుచుందురు.

ఆ దశలో దానధర్మములుగూడం జేయలేడు. తన యాస్తి, ధనము. సర్వము కుమారుల యాధీనములో నుండును. తాను జేయవలెననుకొన్నను గుమారులు చేయనీయరు. ఆ ప్రాయమున ధర్మమునుగాని, యర్థమునుగాని, కామమునుగాని, మోక్షమునుగాని, సాధింపలేడు. అందుచే శరీరము దృఢముగ నుండగనే తరించు సాధనమును జేసికొనవలెను,

## శరీర మెవరిది ?

మానవుడీ దేహము నాది. నే నందముగ నున్నాను. నా కాయా భోగములు కావలయును, అని భ్రాంతి నొందును.

అసలీ దేహ మెవ్వరిది. ఈదేహము తనను గన్నతల్లిదా ? పెండ్లి చేసికొనిన పిదప భార్యను సౌఖ్యపెట్టవలెనని తలంచునుగదా ! అందుచే నీ దేహము భార్యదా ? తన్ను రాజ్యాధినేత పోషించు చున్నాడు. ప్రభువు నిలువమనిన నిలువవలెను. కూర్చుండ మనిన గూర్చుండవలెను, అందుచేత నీ దేహ మారాజ్యాధినే తదా ? మరణించిన పిదప నగ్నిలో బడవైచి కాల్చి వేయుదురు. గాన నగ్నిహోత్రునిదా ? కొందఱు మరణించిన వారిని భూమిలో గప్పియుంతురు. క్రిమికీటకాదులు దేహమును దినివేయును. అందుచే వానిదా యీదేహము. ఇట్లు అపరి శుభ్రమై తుదకేమియుగాకపోవునట్టి యీ శరీరమును జూచి మోహపడును. దీనిపై నాతని కేమియు స్వాతంత్ర్యము లేదు, నశించిపోవునట్టిది. అట్టి దీనిపై నెందులకింత భ్రాంతి ? ఈదే హము పితృమాతృ శుక్రశోణిత సముదాయమువలన గలిగిన నీచశరీరముపై నింతభ్రాంతి యెందులకు ? ఇది యొక నీటిబుడగ వంటిది. ఈ దేహము దృఢముగా నున్నపుడే భగవత్సేవ, భగ వన్నామ స్మరణచేసికొని ముక్తిసాధనము నొనరించుకొన వలెను.

శరీర మారోగ్యముగ నున్నపుడే వార్ధకమునకు దూర ముగ నున్నపుడే యింద్రియపటుత్వ మున్నపుడే యాయువు క్షీణింప నప్పుడే తనతరణోపాయమునకుఁ దాను బుద్ధిమంతుడు ప్రయత్నము జేసికోవలయునుగాని యెప్పుడో జ్ఞానము సంపా

దించుకొనవచ్చుననుట యిల్లంటుకొనిన పిదప నూతిని ద్రవ్వ నారంభించుట యగును. (దీపముండగనే యిల్లు చక్కబెట్టుకొన వలయును). శరీరములనిత్యములు. భోగముల శాశ్వతములు. నిత్యము మనవెంట మృత్యువు తగిలియుండును. కావున నీయు త్తమ శరీరముండగానే ధర్మసంపాదనము జేయవలయును.

చిత్తము క్షణికమైనది. విత్తము చంచలమైనది. మనజీవితములు నశాశ్వతములైనవి. యమునికి గరుణ శూన్యము. కావున ధర్మమును త్వరగా నాచరింపవలెను.

కావున నీ మానవుడు దార్ఢ్యముగ నున్నపుడే భగవంతుని బూజించుట, భగవత్కథలు వినుట, చదువుట, భగవంతుని నామము స్మరించుట, యథాశక్తిగా దానధర్మము లొనరించుట, అన్నదానము జేయుట, తీర్థయాత్రలు చేయుట, సత్పురుషులతో సాంగత్యము నొందుటలవలన దరింపగలడు. అట్లు గావింపనిచో నధోగతి పాలగును.

ఈ కలియుగములో నామస్మరణ పూర్వకమగు భక్తి నాచరించవలెను. చెప్పనలవిగాని పాపములెన్నియైనను విష్ణు మంత్ర జపమువలన నశించును. జయశీలుడగు విష్ణునామమును సర్వదా జపింపవలెను. సర్వము మిథ్యయని తెలిసికొని విష్ణునామమును సర్వదా పఠించి జపించువాడు సర్వపాపములనుండి విడువబడి విష్ణులోకమును బొందుచున్నాడు. మానవుడు నిత్యము విష్ణునామమగు 'హరి' యను రెండక్షరములు జిహ్వతో బలు

కునో ఆనామోచ్చారణ మాత్రమున ముక్తినిబొందుచున్నాడు సందేహము లేదు. తపస్సు ప్రాయశ్చిత్తములంకటె రామ, కృష్ణ నామస్మరణమే గొప్పది.

త్రికాలములందును రాత్రియందు నామస్మరణచేసినచో సర్వపాపములను బోయి విష్ణులోకమునందును, విష్ణుమంత్ర జపమువలననే స్వర్గాది సుఖములనుగూడ బొందును. ఇది ముమ్మాటికిని సత్యము.

రామ రామ రామ రామ యను సప్తామక్షరీమంత్రము నిరంతర మెవ్వడు జపముచేయునో వాడు చండాలుడైనను దరిం చును. పవిత్రుడగును. ఎంత మాత్రమును సందేహము లేదు. కాశి, గయ, ద్వారక మున్నగు తీర్థముల సేవించిన ఫలము లభించును. కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ యని యెవ్వరు జపించి పఠించుచున్నారో వారి పాలోకమువిడిచి విష్ణుసాన్నిధ్యమున నానందించుచున్నారు. రామ యనియు. రామ భద్రయనియు రామచంద్రయనియు నెవ్వడు నిత్యము జపించునో వాడు సర్వ పాప విముక్తుడై శాశ్వతముక్తిని బొందును- అని వశిష్ఠ మహర్షి జెప్పెను,

ఏ మానవుడు 'నారాయణ" యను భగవన్నామము నొకసారి స్మరించునో వాడు మూడునందల కల్పములు గంగాది సర్వతీర్థములయందును స్నానమొనర్చిన ఫలము నొందును,

నారములనగా నుదకము, నీరునుండి యుత్పన్నమగుటచే నీటిని నారములనిరి. పరుడన పురుషోత్తముడు నారములు మొదటి నివాసస్థలముగా గలవాడగుటచేనాతనిని నారాయణుఁడనిరి

నారాయణ యను పదమొక తీఁగ. దానికి నా, రా, య, ణ యను నాల్గక్షరములు నాల్గుచిగుళ్ళు. ధర్మార్థకామమోక్ష ములే యాతీగ కొనసంగుపండ్లు. సంశయము లేదు. భోజనసమ యమున బ్రతికబళమునకును గోవిందనామ సంకీర్తనము గావిం చువాఁడు నిత్యోపవాసి, ఆతడు నిస్సంశయముగ జీవన్ముక్తుడు. మరణసమీపకాలమందు మూడు పర్యాయములు "శివ, శివ, శివ" యని స్మరించుచు శరీరమును విడుచువానికి మొదటి 'శివ' పదమే సంసారపాశమునుఁ ద్రెంప సమర్థమైనది. తక్కిన రెండు పదములను దానము చేయవలసిన పనిలేక మిగిలియున్నది.

మిక్కిలి యల్పముగా జేయుదానమైన నతి స్వల్పమగు జపమైన నత్యల్పమగు హోమమైన ననంతఫలప్రదమగుటచేతను బలిసేవవలన స్త్రీలు తరించుటచేతను గలియుగ సాధువనబడు చుండును.

శ్లో॥ హరేరామ హరేరామ రామరామ హరేహరే।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే॥

హరేరామ హరేరామ మొదలగు బదియారు నామము లుగల మంత్రము కలికాలము నందొనర్చు పాపములను నశింప జేయును.

ఇంతకన్న నుత్కృష్టమగు నుపాయము సర్వవేదములు పరిశీలించినను గన్పింపదని కలి సంతరణోపనిషత్తు వెల్లడించు చున్నది.

మానవుడు కలియుగములో దరించుటకు రెండు మార్గములు చెప్పబడినవి. 1) నామ స్మరణ. 2) పురాణములువినుట నామమాహాత్మ్యము సర్వమును బురాణము లందున్నది. కావున పురాణములు వినవలెను. పూర్వమందు బుట్టినదియు భూత భవిష్యద్విషయములను జెప్పునదియు, పూర్వయుగము లందలి విషయములను చెల్పునవియును, నవ్య నవ్యములై మానవ హృదయముల నాకర్షించునవియును పురాణములనియు పలువురు నిర్వహించినారు. కాన పురాణములు వినవలెను.

శ్లో॥ విష్ణుం నారాయణం కృష్ణం మాధవం మధుసూదనం
హరిం నరహరిః రామం గోవిందం దధివామనమ్.

తా॥ విష్ణు, నారాయణ, కృష్ణ, మాధవ, మధుసూధన హరి నరహరి, రామ, గోవింద, దధివామన అనువది నామములను భక్తియుక్తులై స్మరించి తరించండి (బ్రహ్మవైవర్తము)

ఓం తత్సత్

శ్లో॥ ఇతి షోడశకం నామ్నాం కలికల్మష నాశనమ్
నాతః పరతరోపాయ సర్వవేదేషు దృశ్యతే॥



# మంత్రపుష్పము - భావము

1. ఓమ్ సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్

'ఓం' అనేక శిరములు కలది. అనేక నేత్రములుగలది. సర్వమునకు సుఖము కల్గించునది. సమస్తమయినది.

2. విశ్వం నారాయణం దేవమక్షరం పరమం పదమ్ ।

దివ్యరూపము నరుల సముదాయమందు నుండునది, నాశము లేనిది, పరమపదమైనది. (ఆస్థానమే యన్నిటి పైదని అర్థము)

3. విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్ ।

అన్నిటిమీది దానికంటె మీదిది. నిత్యమైనది, నారాయణుండని, హరియని సర్వమును వ్యాపించియున్నది.

4. విశ్వమేవేదం పురుషస్తద్విశ్వముపజీవతి ।

ఈ కనపడుచున్న ప్రపంచమంతయును ఆపురుషుని స్వరూపమే. దాని నాశ్రయించియే ప్రపంచము జీవించుచున్నది.

5. పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతం ।

విశ్వమునకు దానధిపతి, తనకుదానే యధికారి. శాశ్వతము; మంగళకరము. నాశములేనిది, అందరి నరులలోను ఉండునది.

6. నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం ।

గొప్పగా తెలియదగియున్నది, ప్రపంచమున కంతటికిని ఆత్మ (జీవాత్మ) రూపమైయున్నది అదే పరమగతియైయున్నది.

7. నారాయణ పరోజ్యోతిరాత్మా నారాయణః పరః ।

నరులలోనున్న యా ఆత్మయె యెక్కువయిన తేజస్సు అదేపరమాత్మ

8. నారాయణ పరబ్రహ్మ తత్త్వం నారాయణః పరః ।

నారాయణుడే పరబ్రహ్మ, నారాయణుడే పరతత్త్వము.

9. నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణ పరః ।

ఇట్లు ధ్యానించువాఁడు నరుఁడగు నారాయణుఁడే ఆధ్యానమును ఉత్కృష్టుడైన ఆనారాయణుడే. [ధ్యానముచేయువాఁడు, ఆధ్యానము, ధ్యానముచేయబడువాఁడు సర్వము నారాయణుడే. అదే పరమాత్మ, అదె పరతత్త్వము ]

10. యచ్చకిఞ్చి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపివా ।

మనకుఁగనబడుచున్న మనము వినుచున్న ప్రపంచమేది కలదో అదంతయు మరియు మనము చూడనిది విననిది యగు ప్రపంచమంతయు గూడను.

11. అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః ।

లోపలనున్నది బయటనున్నది, ఆ సర్వప్రపంచమును వాది నారాయణుడున్నాడు,

12. అనంత మవ్యయం కవిగ్ం సముద్రే న్తం విశ్వశమ్భువమ్ ।

అంతములేనిది, నాశములేనిది, సర్వముఁ దెలిసినది, ఆకాశమంతంతము గలది, (అనగా సముద్రమంటే ఆకాశము ఆకాశమెక్కడ నంతమగునో అచటనే దీనికంతము, ఆకాశమునకు అంతములేదు. దీనికిని అంతములేదు.) ప్రపంచమునకు సుఖముకలిగించును. (ఇట్లు పరమాత్మను జెప్పి జీవాత్మను అదియుండుస్థానము వర్ణించుచున్నాడు.)

13. పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధో ముఖం ।

తామరమొగ్గ ఆకారముగా నధోముఖమై వ్రేళ్ళాడుచు

14. అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యా ముపరి తిష్ఠతి ।

బొడ్డుకు పండ్రెండంగుళాల మీదికి (ఒక వస్తువు) వున్నది.

15. జ్వాలమాలాకులంభాతి విశ్వస్యాయతనం మహత్ ।

అది మంటలతో నిండి సమస్త ప్రపంచమున కాధారమయినచోటది.

16. సన్తతగ్ం శిరాభిస్తులమ్బత్యాకోశ సన్నిభం ।

ఎల్లప్పుడు రక్తనాడులకు వ్రేలాడుచుండును. ఇంచుక మొగ్గవలె నుండును. (అనగా చివరను గొంత సందున్నదని తాత్పర్యము)

17. తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్త్సర్వం ప్రతిష్ఠితం ।

ఆ మొగ్గ చివరను చిన్న రంధ్రమొకలదు. ఆచివర నంతయు గలదు. [దాని లోపల గొప్ప యగ్నికలదు.]

18. తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః సోఽగ్ర
భుగ్విభజన్తిష్ఠన్నాహారమజరః కవిః ।

దానిలోపల గొప్ప యగ్నికలదు. ఎటుచూచినను దానిలో మంటలు కలవు. అన్ని ముఖములను ఆమంటలు వ్యాపించును. ఆయగ్నియే ఆహారమును మొదట తినువాడు. [ఆ తినిన యాహారమును అన్నిటికిని పంచుచుండును.]

19. తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సన్తతా
సన్తాపయతి స్వందేహ మాపాదతలమస్తకః ,

ఆ యగ్నికి ముదిమియే లేదు. అన్నీ తెలిసినది, దానికి కిరణములు అడ్డుగాను, నిలువుగాను, క్రిందుగాను. ఉండి ప్రసరించుచున్నవి.

20. తస్యమధ్యేవహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః ।

దాని మధ్యను సన్ననిదై మీదికి ప్రసరించుచు అగ్నిశిఖ అనగా అగ్నిజ్వాల కలదు.

21. నీలతోయదమధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా ।

నల్లని మేఘముమధ్యను మెఱుపుతీగవలె ప్రకాశించుచు. ..

22. నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా ।
వరిముల్లు ఎంత సన్ననిదో అంత సన్ననిదై పసుపుపచ్చరంగుగలిగి అణుమాత్రమె చక్కగా (ఆహారమును) తినుచున్నది.

23. తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః
ఆ యగ్నిజ్వాల మధ్యను (అనగా నీ చెప్పిన దంతయు జీవ విషయము ఆ జీవునిలోనే అని తాత్పర్యము) పరమాత్మయున్నది.

24. సబ్రహ్మా సశివస్స హరిస్సేన్ద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్।
అదే బ్రహ్మ, అదేహరి, అదేఇంద్రుడు, అదే అక్షర (నాశములేని) పరబ్రహ్మము, స్వరాట్టు.

25. ఓం తద్బ్రహ్మ।
అదే బ్రహ్మ

26. ఓం తద్వాయుః
అదే వాయువు

27. ఓం తదాత్మా।
అదే ఆత్మ

28. ఓం తత్సత్యం।
అదే సత్యము

29. ఓం తత్పురోర్నమః।
అదే సర్వము, అదేముందు గనంబడునది

30. అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు।
అది అన్ని భూతముల (జంతువుల) యందును లోపల సంచరించును. సకల శరీరములందును గుహాలోనుండును. [గుహాయనగా నిదివఱకు చెప్పిన తామరమొగ్గ మధ్యమున్న అవకాశము. అది అంగుష్ఠమాత్రమేయుండును. దానినే దహరాకాశమందురు.]

31. త్వం యజ్ఞ స్త్వం వషట్కార స్త్వ మింద్ర స్త్వగ్ం
రుద్ర స్త్వం విష్ణు స్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః।

నీవే యజ్ఞరూపుడవు. నీవే వషట్ అని ఉచ్చరించిచేసిన హోమ స్వరూపుడవు. నీవే ఇంద్రుడవు, నీవే రుద్రుడవు, నీవే విష్ణువు, బ్రహ్మవు నీవే, ప్రజాపతివి నీవే.

32. త్వం తదాప ఆపోజ్యోతీరసోఽమృతం బ్రహ్మ
భూర్భువస్సువరోమ్॥

నీవే యుదకము. ఉదకములోని తేజస్సు అనగా విద్యుత్తు నీవే. అందునున్న రుచి, నీవే, అమృతము నీవే, నీవే బ్రహ్మ సమస్తలోకములును నీవే.

ఓం, సహనావవతు, సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై తేజస్వినా
వధీతమస్తు, మావిద్విషావహై.
ఓం తత్సత్

1. స్వస్తి ప్రజాభ్యః
ప్రజలకు శుభము కలుగుగాక !

2. పరిపాలయన్తాం న్యాయేన మార్గేణ మహీంమహీశాః
తా॥ న్యాయమగు పద్ధతులలో రాజులు ప్రజలను పాలింతురుగాక.

3. గోబ్రాహ్మణేభ్యః శుభమస్తునిత్యం
తా॥ గోవులకును బ్రాహ్మణులకును శుభమగుగాక !

4. లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు.
తా॥ సమస్త ప్రపంచమును సుఖాబ్ధి నోలలాడుగాక !

1. కాయేన వాచా మనసేంద్రియైర్వా

తా॥ శరీరముతోగాని, మాటలతోగాని, మనస్సుతోగాని, మఱియు నేయితర యింద్రియములుగాని లేక

2. బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్

తా॥ బుద్ధితోగాని, ఆత్మసాక్షిగా గాని, ప్రకృతి స్వభావము ననుసరించిగాని,

3. కరోమి యద్యత్ సకలం

తా॥ ఏఏ పనులు చేతునో వాటి నన్నింటిని

4. పరస్మై

తా॥ పరాత్పరుడగు

5. న్నారాయణాయేతి

తా॥ నారాయణునకు

6. సమర్పయామి.

తా॥ సమర్పించుచున్నాను,

ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః

ఓం = ప్రణవ ప్రతిపాదితమగు బ్రహ్మము మాయందనుగ్రహించుగాక!
శాంతిః = ఆధ్యాత్మిక తాపశాంతి యగుగాక!
శాంతిః = భౌతిక తాప శాంతి యగుగాక!
శాంతిః = ఆది దైవిక తాపశాంతి యగుగాక!





# భక్తులకు సూచన

భక్తాగ్రేసరులారా !

భగవంతుఁడు పరమాత్మ్మం డగుటచే నిజసుతాదులగు జీవాత్మలను దరచు యాగ్రహించి,

శ్లో॥ తానహంద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్ర మశుభానాసురీష్వేవయోనిషు॥

భగ: 16అ. 19 శ్లో.

ద్వేషించు పాపాత్ములు క్రూరకర్మలగు నరాధముల నసురయోనిం ద్రోయుదు "నక్షమామివ వసుంధరే" యని కోపారుణిత లోచనుండయి పలుక మహాభక్తులు భగవతికి మొఱలిడి రక్షింపమని వేడగ నద్దేవియు బెక్కురీతుల నతి వినయంబున నద్దేవదేవునికిం దెల్పి శాంతచిత్తునొనర్చి వారల రక్షింపజేయును.

కావున శ్రీ సీతారాముల, శ్రీ రుక్మిణీ కృష్ణుల, శ్రీ లక్ష్మీ నారాయణుల, శ్రీ పార్వతీ పరమేశ్వరుల నొకటిగా బూజింప వలయునుగాని వేరొనర్పరాదు.

అనగా సీతాసమేత శ్రీరాముని, రుక్మిణీసమేత శ్రీకృష్ణుని, లక్ష్మీసమేత శ్రీమన్నారాయణుని, పార్వతీసమేత శ్రీ పరమేశ్వరుని, బూజింపవలయును. భగవతిని విడిచి భగవంతుని, భగవంతుని వదలి భగవతిని నెట్టితెరియును బూజింపరాదు. బాల కృష్ణుని నొక్కనిగా బూజింపదగును.

జానకీరహిత దాశరథిం బూజించువారలు శూర్పణఖ వలెను, శ్రీరామరహిత సీతం బూజించుభక్తులు దశవదనుం మాడ్కిం జెడుదురు.

ఓం తత్సత్



## ఫలశ్రుతి—మంగళాచరణము

విజయ కామ్యసిద్ధి, విజ్ఞాన ఫలవృద్ధి
జ్ఞానబుద్ధి, సర్వసారలీల
మేలు "రామకృష్ణలీలాతరంగిణి"
గూర్చుగాత భక్తకోటికెప్డు

శ్లో॥ మంగళమ్ కోసలేంద్రాయ
మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ
సార్వభౌమాయ మంగళమ్ ॥

శ్రీ రామ శ్రీకృష్ణార్పణమస్తు
ఓం శాంతి శ్శాంతిః శ్శాంతిః



ఈ గ్రంథ ముద్రణకు తోడ్పడిన వదాన్యులు

## -: మహారాజపోషకులు :-



**శ్రీ అష్టముఖ గండభేరుండ లక్ష్మీనృసింహ [illegible]త్ర జగద్గురు పీఠమ్**

## సింహపురి—మాదిపాడు.

(గుంటూరు జల్లా, సత్తెనపల్లి తాలూకా వయా అచ్చమ్మపేట)

ప్రతిష్ఠ : ది. 14-6-1970,

అపూర్వము, అద్వితీయము, అత్యంతోత్కృష్టమైనది.

స్థాపకులు మరియు ధర్మకర్తలు :

## శ్రీ జగద్గురు సత్యానందేంద్ర సరస్వతీస్వామివారు

శ్రీ జూపూడి నరసింహారావు, బర్మాషెల్ ఏజంట్, ఖమ్మం

శ్రీ జూపూడి విశ్వనాధరావు. (రిటైర్డు సూపరింటెండెంటు,
పశుగణశాఖ) వరంగల్

శ్రీ రాచకొండ వేంకటనాధశాస్త్రి వారి సతీమణి
కృపావతి, కలకత్తా

శ్రీ బండారుపల్లి అచ్యుతరామమూర్తి యం. ఏ.,
తోటరావులపాడు.

శ్రీ గద్దె వీరనాగయ్య, కంచకచర్ల

శివశ్రీ ముదిగొండ చంద్రమౌళి,
జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, గుంటూరు

శ్రీ పీసపాటి వేంకట రమణారావు, కరణం–పీసపాడు

శ్రీ డా॥ దీవి హనుమాచార్యులు, R. M. P. స్వర్ణ.

## -: రాజపోషకులు :-

శ్రీ తురగా సూర్యనారాయణ,
లైన్ ఇన్‌స్పెక్టరు, A P S R B సత్తెనపల్లి

శ్రీ కె లక్ష్మీనారాయణ,
అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, అచ్చమ్మపేట

శ్రీ సి. వి. సుబ్బారావు, సూపరింటెండెంటు,
సెంట్రల్ ఎక్సైజు–హైదరాబాదు

శ్రీ జి. యస్. కె. హరనాధబాబు,
డిప్యూటీ తహశ్శీల్‌దారు–సత్తెనపల్లి

శ్రీ కె. వి. సుబ్రహ్మణ్య శర్మ. కరణం-లింగాపురం స॥ తా॥
శ్రీ శాఖమూరి వేంకట దుర్గాప్రసాదరావు, తాడువాయి
శ్రీ యస్. మొహిద్దీన్, రెవిన్యూ డిపార్టుమెంట్ స॥ తా॥
శ్రీ కె. వేంకటేశ్వరరావు మేనేజరు,
యరాక్ డిపార్టుమెంటు-సత్తెనపల్లి
శ్రీ సి. మల్లికార్జునరావు, రెవిన్యూ ఇన్‌స్పెక్టర్-సత్తెనపల్లి
శ్రీ వారి పుణ్యకోటి, బ్రాడీపేట-గుంటూరు
శ్రీ యం. యన్. సూర్యనారాయణ.
రెవెన్యూశాఖ-గుంటూరు
శ్రీ డా॥ గొట్టుముక్కల అంకంరాజు,
ఆరోగ్యాశ్రమం. చిగురుపాడు స॥ తా॥
శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరీ రైస్‌ఫ్లోర్ అండ్ ఆయిల్ మిల్
దొడ్లేరు.
కీర్తిశేషులైన శ్రీ భృగుబండ వేంకట రమణయ్యగారి జ్ఞాప
కార్థము వారి కుమార పంచకము.

# పోషకులు

అచ్చమ్మపేట.-

శ్రీ గారు

టి. వేంకటేశ్వరరావు - (పోలీస్ సబ్ ఇన్స్పెక్టరు).- టి. మల్లయ్య - (సబ్ పోస్టుమాస్టరు) డి. భాస్కరరావు-(సెక్షన్, అఫీసరు) State Bank :- పి. వి. నరసింహారావు (S B M)

(శ్రీ) గారు

చి. జోగేశ్వరరావు (H C) వై. వేంకటరత్నం) సి. హెచ్. వేంకటేశ్వరరావు - డి. వేంకటేశ్వరరావు ఎస్. ఎస్. ప్రసాద్) వై. రామకోటేశ్వరరావు (Dy. రేంజిఆఫీసరు) జి. వేంకటరత్నం S.I (State Exeise) ఎస్. నాసరయ్య ఎల్. శ్రీరామమూర్తి, కె. నిరంజనబాబు,- గ్రామపంచాయితీ,- పి. వి. ఎల్ నరసింహారావు (సర్పంచి) కె. సాంబయ్య (E. O) కె. రామారావు, (V. D. O) జె. కోటయ్య, అర్. సిహెచ్ మస్తానయ్య, పి. నాగేశ్వరరావు,- వైద్యబృందం,- డా. యం మధుసూదనరావు (M B B S) పి. ఎస్. వల్లభమూర్తి G C M పి. రామయోగేశ్వరరావు (M S C N M) ఎస్. సైదాసాహెబు వి. అయ్యవరాజు కె. వెంకటేశ్వర్లు (కాంపౌండరు),- గ్రామాధికారులు,- కె. వి సత్యనారాయణ (కరణం) ఆర్. రామనాథం (మునసబు)

ఉన్నతపాఠశాల:- ఎస్. జైనుల్లాద్దీన్ (H M) జి. చిట్టిబాబు యం. సత్యనారాయణ,- బి. నాగలింగం పి. యుగంధర్ చి. నాగేశ్వరరావు సి. హెచ్. రంగారావు యం. సుబ్బయ్య ఇ. హనుమంతరావు N S C,- P S E S -- కె. అచ్చయ్య H M) యం. నాగభరణశర్మ,- సి. హెచ్. లక్ష్మి తులశమ్మ కోటేశ్వరరావు,- ఎస్. రంగారావు (సినీఆపరేటరు) మకరాల రాజరాజేశ్వరీసూర్యనారాయణశాస్త్రి,-కొమారమంగమ్మ లేటు W-O వేంకట సుబ్బారావు. కొండూరు లలితమ్మ W-O లేటు

శ్రీ గారు
గోవిందయ్య.- గుండా శేషమ్మ.-గుంటూరు బలరామాచార్యులు
మ్రి శివరామయ్య (A P S E B) కోణికి రాఘవాచార్యులు
కె. శివకోటయ్య నూరావఝుల, కృష్ణయ్య- వల్లభోజు నాగే
శ్వరరావు - దార్ల నాగలింగయ్య .-జి నీలయ్య. వై శ్రీవారి
(శ్రేకటరి) షేక్. సుభాన్,- పచ్చవ. రామయ్య,- ఉప్పుగల్లు
రామయ్య ప్రత్తిపాటి రాయుడయ్య ఎస్. హెచ్. పెంటు
సాహెబ్ (P C 1792)

శ్రీ కన్యకా పరమేశ్వరి ఆర్యవర్తక సంఘం

అచ్చమ్మపేట:-

శ్రీ చలువాది. ఆంజనేయులు,- యీా నరసింహాం అండ్ సన్స్
అడ్డగిరి వేంకటనరసయ్య,- నూరె. సుబ్బరామయ్య తుమ్మోపల్లి
వేంకట్రావు పులిపాటి. మంగయ్య యీా. సత్యనారాయణ
యీా. రామమోహనరావు దాసరి. సాంబశివరావు- S-O పుల్లా
రావు యీా. పెదవీర రాఘవయ్య శ్రీ సత్యనారాయణ
ఫర్టిలైజర్స్ శ్రీ వేంకటేశ్వర రైస్ అండ్ ఫ్లోర్ మిల్లు
శ్రీ శైలజ రైస్ మిల్లు పెరుమాళ్ళ. పెదవీర రాఘవులు
అండ్ సన్సు.- దోరెడ్ల. వేంకట తిరుపతయ్య ఫర్టిలైజర్స్
మద్ది. ఆంజనేయులు,- లక్ష్మీజనరల్ స్టోర్సు- నూరె. అప్పా
రావు ట్రేడర్స్ శ్రీ సుధాకర ట్రేడర్స్ (మెడికల్ స్టోర్స్)
నూరె. సత్యన్నారాయణ అండ్ సన్సు జవ్వాజి లక్ష్మయ్య
మద్ది. వేంకట లక్ష్మీ నాగేశ్వరరావు అత్తలూరి. ఆంజనేయులు

(శ్రీ) గారు

పులిపాటి. రామగురవయ్య S-O హనుమయ్య - సోము. సత్యానారాయణ.- నూరె. చలమయ్య అండ్ బ్రదర్సు అడ్డగిరి. నరసింహారావు అండ్ బ్రదర్సు.- పులిపాటి. వేంకటేశ్వర్లు డోగిపర్తి. అమర లింగస్వామి సన్నిధి రామలింగస్వామి అప్పయ్య బ్రదర్సు - లక్కరాజు నరసరాజు (P. M. co) చలువాది. వేంకటేశ్వర్లు యీ. విశ్వేశ్వరరావు నూరె. నరసింహారావు అండ్ బ్రదర్సు దోరెడ్ల. రామలింగస్వామి నూరె. లక్ష్మీనరసింహారావు (శ్రీ) వేంకటేశ్వరవిలాస్ యేలూరి. సాంబశివరావు యీ బసవగురునాధం (శ్రీ) దుర్గావిలాస్.- కొప్పురావూరి నాగేశ్వరరావు పెరుమాళ్ళ నరసింహారావు యీ. అమరలింగస్వామి కొత్తమాసు అప్పారావు గుండా. శేషమ్మ సోడిశెట్టి. వేంకటేశ్వర్లు

అప్పికట్ల :- ఎ అచ్యుతరామశర్మ. BED Asst.

అబ్బూరు :- బి. ఆంజనేయులు.

అద్దంకి - కొత్తమాసు గోపాలకృష్ణయ్య. శ్రీనివాస రైస్ మిల్లు, - అంబడిపూడి :- చావ వేంకటేశ్వర్లు, సర్పంచి. అమరావతి :- Ch. L. కాంతారావు, (Retd. S. I. of Police) - అనందాశ్రమం-గోలి-రెంటచింతల:- (శ్రీ) హరితవస్త్రధారి విశ్వయోగి - ఊటుకూరు :- కె. భాస్కరరావు,

శ్రీ గారు

హెచ్. యం., బి. రంగారావు సి హెచ్. వెంకటేశ్వర్లు, ZPHS, శాఖమూరి బసవయ్య, శాఖమూరి రామలింగయ్య శాఖమూరి రామారావు, బి. నరసింహమూర్తి – మునసబు, యం. వేంకటేశ్వర్లు (P T I), కె సుబ్బారెడ్డి B P M.

కంకణాలపల్లె :- కొమార సీతారామభద్రయ్య,

కలకత్తా :- రాచకొండ కృపాపతీ వేంకటనాధ శాస్త్రిగార్లు,

కట్టమూరు :- మందడి చంచయ్య, మందడి వీరభద్రయ్య, మందడపు రామయ్య, కట్టమూరు హనుమంతరావు-కరణం, కటకం పిచ్చారావు తండ్రి వేంకటేశ్వర్లు దోరెడ్ల రామలింగం, ఆతుకూరి రామనరసయ్య, కోగంటివారిపాలెం :- తల తల రామిరెడ్డి, కె. కోటయ్య H M, కొత్తపల్లి :- మేకల కృష్ణ మూర్తి-సర్పంచి, కె చంద్రప్రకాశయ్య-మునసబు, బి. వేంకటే శ్వర్లు-కరణం, శ్రీ సరోజినీనాయుడు-మహిళా మండలి, యం. సీతారామయ్య-టీచరు, తమ్మా కోటిరెడ్డి, ఉనుముల అంజి రెడ్డి, లక్కిరెడ్డి లక్ష్మారెడ్డి. క్రోసూరు :- కె. సూర్యచంద్ర రావు-A E, పి. సూర్యనారాయణ-S O I, జె. యన్. గుర వయ్య-S O II. కె యన్. శాస్త్రి H C (NSC), తుమ్మల కుటుంబరావు-శ్రీవేంకటేశ్వర రైస్‌మిల్, బి. జె. శర్మ-B M వై. పిచ్చయ్య-H C, కె. ఆర్. రావు-కరణం, కె. వీరభద్ర రావు – స్టేట్ బ్యాంక్, డా॥ యన్. సూర్యప్రకాశరావు- M. B., B. S., పి. సూర్యనారాయణ - న్యూస్ ఏజంటు, గోలి సుబ్బారావు-క్లాత్ మర్చంట్, కటకం గోపాలరావు-

శ్రీ గారు

మెడికల్స్. మారం వేంకట సీతారామయ్య-శ్రీ గోపాలకృష్ణ రైస్ మిల్, ఉన్నత పాఠశాల :- డి. అప్పారావు-H M, యం. వేంకటేశ్వర్లు, జె. జి. కృష్ణమూర్తి. బి. లక్ష్మయ్య, బి. భాస్కరరావు, డి. రాధాకృష్ణమూర్తి, Ch. నరసింహదీక్షిత శర్మ, పి. శ్రీరామమూర్తి-(H M రెంటపాళ్ళ).

ఖమ్మం :- జూవ్వాడి నరసింహారావు-ఏజంట్. బర్మాషెల్, యేటూరి యాదగిరిరావు.

గుంటూరు : శివశ్రీ ముదిగొండ చంద్రమౌళి-జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్. మోచర్ల శ్రీహరిరావు - రామన్నపేట. బండారుపల్లి అప్పారావు - (పట్టాభిపురం), జగర్లపూడి చంద్రశేఖరం రిటైర్డు సబ్ జడ్జి. శ్రీహరి పుణ్యకోటి. మాగులూరి బసవాచారి - శోభా ప్రేమ్‌వర్క్సు. టి. వి జి కృష్ణమూర్తి లెక్చరర్, ఎలక్ట్రిసిటీబోర్డు :- నందూరు వేంకటకృష్ణంరాజు బి. కామ్. హెచ్., ఇ బి. బి. వేంకటేశ్వర్లు, యన్. లక్ష్మీనరసింహామూర్తి ఇ. రామకృష్ణప్రభు, పోలంరాజు రాధాకృష్ణమూర్తి. దోనేపూడి గోపాలకృష్ణమూర్తి - అగ్రహారం, సరాజు వేంకటహనుమంతరావు ప్రొ॥ శ్రీనివాసఎంటర్ ప్రైజస్, డా॥ చిరివిరాల సత్యనారాయణ-ధన్వంతరీమెడికల్స్, కొంపల్లి రామారావు, - ఎండోమెంటు. నామకోటేశ్వరరావు, శీతారామాంజనేయ ఆలయస్థాపకులు, బ్రాడీపేట. పాటిబండ హనుమంతరావు, S/o వేంకటప్పయ్య, అడ్వకేటు. నిమ్మకాయల లక్ష్మీనారాయణ. యన్. యర్. యన్. శర్మ, (జి. పి. ఎ.) యం. జేమ్సు-శెక్రటరీ (ఆర్. టి. సి.)

గుండ్లపల్లి; యేలూరి నరసింహయ్య.

చల్లగరిగ : నూరెకోటి గురునాథం, గంగసాని చిన గుర్వారెడ్డి - (సర్పంచ్), నంబూరి చంద్రారెడ్డి. జి. తిరుపతి రెడ్డి. కె. కృష్ణంరాజు, (టీచరు). డోగివర్తి రాధాకృష్ణ మూర్తి. (బి. పి. యం.) యీా వేంకటరత్నం.

చామర్రు : అగ్గరాజు భీమరయ్య, ఉప్పల వేంకటేశ్వర్లు (టీచరు). రాయిడి హనుమంతిరావు, (మునసబు). మద్దినేని సత్యనారాయణ. నెల్లూరి వేంకటేశ్వర్లు- (వైస్ ప్రెసిడెంటు) రాయల సుందరరావు, రేవులపుడుగు ఏడుకొండలు;

చిగురుపాడు : డా॥ గొట్టుముక్కల అంకంరాజు, గొల్లపూడి దత్తాత్రేయులు (మునసబు) కె. వీరారెడ్డి (కరణం) కొత్త రామనాథం. (వి. డి, ఒ) డి రాములు (మాజీహెడ్ మాష్టర్) వి. యస్, ఆర్. మూర్తి (హెడ్మాష్టరు) నంది గామ సత్యనారాయణ, (రిటైర్డుటీచరు);

చింతపల్లి : రాజావాసిరెడ్డి జగన్నాధబాబు బహద్దూర్, చింతపల్లి హనుమంతరావు, (కరణం) సి. హెచ్. కృష్ణమూర్తి కె. అప్పారావు, (వి- డి, ఒ)

తెనాలి: యం. భూమానందరాజు-నాజరుపేట డేగలవారివీధి;

తాడువాయి : యస్. వి. దుర్గాప్రసాదరావు. రంగి శెట్టి రామచంద్రరావు, (వి. యం.) చావ వేంకటప్పయ్య.

(శ్రీ) గారు

టి. వేంకటప్పారెడ్డి బి. ఏ. అనుమోల నరసింహారావు; చావ సీతారామయ్య.

తాళ్ళూరు ; డి. కోటేశ్వరరావు (వి. డి. ఒ).

తోటరావులపాడు : బండారుపల్లి అచ్యుతరామమూర్తి; రావ్రులపాటి సరస్వతమ్మ, ములకలపల్లి కృష్ణయ్య;

దొడ్లేరు : శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరీ రైస్ ఫ్లోర్ ఆయిల్ మిల్లు; శ్రీ దశరథరాం రైస్ అండ్ ఫ్లోర్ మిల్లు,

దేవరంపాడు : దేశినేని వేంకటాద్రియ్య.

నర్సరావుపేట : యేలూరి నరసింహయ్య (మల్లికార్జున మెడికల్ కార్పరేషన్;

నీలేశ్వరపాలెం : టి. కృష్ణమ్మ (సర్పంచి)

పమిడిపాడు: డి. సత్యనారాయణ, యస్.ఒ.యన్.యన్.సి

చిలకలూరిపేట : కె. వి. హనుమంతరావు, ఇ. ఓ. టెంపుల్స్

పిడుగురాళ్ళ : ఉడుతా రామతులశయ్య C/o శ్రీ రామా మెడికల్స్;

పెద్దవరం : వబ్బరాజు వేంకటచంద్రశేఖరరావు.

పెదపాలెం : పాటిబండ్ల శింగరయ్య (ప్రెసిడెంటు-భూమితనఖా బ్యాంకు-సత్తెనపల్లి). నెల్లూరి అనసూయమ్మ నూరయ్యా! డా॥ ఓరుగంటి వేంకటసుబ్రహ్మణ్యం, వేల్పూరు వేంకటసుబ్రి

(శ్రీ) గారు

వ్యాణ్యం, కరణం. నెల్లూరి నారాయణ (శ్రీ సీతారామ రైస్ మిల్లు). డా॥ జె. వి. నారాయణరెడ్డి (వెటరినరీఆఫీసరు) వి. శివ రామప్రసాదు (హెచ్. యం.)

పెదమక్కిన : మంగినపూడి రామకృష్ణారావు (కరణం) నడింపల్లి సత్యనారాయణ (టీచరు)

పొణుకుపాడు : ఆర్. తాతయ్య (హెచ్. యం.

ఫిరంగిపురం : డా॥ దేశిరాజు హనుమంతరావు.

పీనపాడు : పి. వెంకటరమణరావు-కరణం, పి. వేంకట రావు, అల్లు వేంకటస్వామిరెడ్డి, బూతుకూరి అప్పిరెడ్డి, మద్ది కామేశ్వరరావు.

బెంగుళూరు : పి. సంగమేశ్వరరావు (ఎ. ఇ) గవర్నమెంటు క్వార్టర్సు;

మదరాసు : యం. రామచంద్ర అప్పారావు- త్యాగరాజ మందిరం-త్యాగరాజనగర్.

మండెపూడి : బి. మల్లికార్జునరావు (హెచ్, యం)

మేడికొండూరు: యం, రాధాకృష్ణమూర్తి హెచ్. యం, యం ఆనందయ్య,

బొంబాయి : 34 శ్రీకృష్ణ 14-బి/6 గవర్నమెంటు క్వార్టర్సు - వాజీఆలీ.

శ్రీ గారు

రాజమండ్రి : పి, సూర్యనారాయణ బి. ఇ. యఫ్, ఐ.ఇ. రిటైర్డు ప్రొఫెసర్ - గాంధీపురం;

వరంగల్లు : జూపూడి విశ్వనాధరావు,

విప్పర్ల : కొండవీటి వేంకటప్పయ్య, నర్రా చల్లయ్య, నర్రా రఘుపతి, పరాశరం అంజనేయాచార్యులు.

విజయవాడ : నందూరు వీర వేంకటసాంబశివరావు-ఇన్స్పెక్టరు సెంట్రల్ ఎక్సైజు, నందూరి బలరామరాజు - రిటైర్డు డిప్యూటి చీఫ్ అకౌంటెంటు.

వేల్పూరు :- వి. పాండురంగారావు-కరణం, జి. వేంకటేశ్వర్లు-మునసబు. H M & Staff :- P. S. U. P. గుంటుపల్లి వేంకటరత్నం, డా॥ జి. వేంకటరాఘవాచార్యులు, జి. వేంకట తిరుమలాచార్యులు, పి. సత్యనారాయణ, మద్ది నాగభూషణం, మద్ది లక్ష్మీనరసింహస్వామి, పేరం వేంకట్రావు-రైస్ మిల్లు.

శిరిపురం :- బి. బి. ప్రహ్లాదరావు - H M; Z P H S.,

సత్తెనపల్లి ;-సి. మల్లికార్జునరావు R I, State Bank :- కె. రామకృష్ణారావు-D M, కె కృష్ణభాష్యం, జి. యల్. చౌదరి, బి. యస్. యన్. మూర్తి, వి. శ్రీరాములు, Ch. L V S N Rao, పి. వి. యల్. యస్. రావు, జి. శ్రీనివాసమూర్తి, వి. వి. రమణయ్య-S T O, సిహెచ్. వేంక

శ్రీ గారు

టేశ్వర్లు-ప్రెసిడెంట్, బి. వి. కృష్ణమూర్తి-కరణం. కె. హనుమంతరావు - Inspector fo Central Excise, హరి కోటయ్య-E O Endoment వి వేంకటపతి-Superviser L.M.B. ఎ. డి. కోటేశ్వరరావు - Accountant C. A. B. Bank, వంకాయలపాటి సుబ్బారావు-V. D. O., డి. వి. సుబ్బారావు-సర్పంచి. టి. కాశినాధరావు. ప్రతివాది భయంకరం రఘునాధా చార్యులు-(Retd. H C) వి. నాగభూషణం- L.D.C., పి. వి. పురుషోత్తం-U. D, R, I., యస్. సుబ్బారావు-U D R I డా॥ సి హెచ్. వేంకటేశ్వర్లు, శిఖా వేంకటేశ్వర్లు. పి. సాంబయ్య-కంట్రోలర్-A P S R T C, సంబూరు లక్ష్మీవరప్రసాదదేవి-శ్రీరామ శ్రీకృష్ణమందిర్. యద్దనపూడి మాధవరావు, జి రామసూర్యనారాయణ, యల్. పి. నారాయణరావు-ప్రొ॥ శంకర్ విలాస్, సి హెచ్. సుబ్రహ్మణ్యం-ప్రొ॥ శ్రీ సుబ్బలక్ష్మి విలాస్. పి. యస్. మూర్తి-ప్రొ॥ శ్రీ వేంకటరమణ విలాస్, శ్రీ ఉడిపి గంగా విలాస్, వి. రఘునాధాచార్యులు-పంచాయతి. మందాల సాంబిరెడ్డి-మెమ్బర్స్.

శ్రీ కన్యకాపరమేశ్వరి ఆర్యవైశ్య వర్తకసంఘం, సత్తెనపల్లి

దూబగుంట్ల సుబ్బారావు- ప్రొ॥ శ్రీ వేంకట లక్ష్మి రమణ క్లాత్ మర్చంట్. కందికట్ల సుబ్బారావు అండ్ సన్సు త్రిపురమల్లు కోటయ్య, అన్నం వేంకట నారాయణ అండ్ సన్సు, శ్రీ వేంకట రమణా ఫ్యాన్సీ అండ్ స్టేషనరీ, శ్రీ నాగార్జున

శ్రీ

రేడియో స్టోర్సు. పి గురునాథం! దేవరశెట్టి వేంకట
రావు. బయన పెద్దన్న-ఫ్యాన్సీ స్టోర్సు. మద్ది రా
అండ్ సన్సు, మట్టా వేంకట సుబ్బారావు, కూనాగు
రంగయ్య అండ్ సన్సు. సిహెచ్. గురుపాదం-సైకి
చక్కా శ్రీరాములు, చంద్రపాటి వెంకయ్య, మట్ట
చాము వేంకటేశ్వరు C/o కూ. వే. రం, అన్న
మూర్తి, జివ్వాజి జగన్నాథం. తుమ్మల పిచ్చయ్య &

ధూళిపాళ :- వి. నాగేశ్వరరావు HM., సి
చంద్రమౌళి HM. మునగోడు:- N. P. ప్రసాదరా

బయ్యావరం :- వి, యన్, ఆర్ రెడ్డి (హెచ్, ఎ
నాగేశ్వరరావు అసిస్టెంటు.

హైదరాబాదు : సి, వి, సుబ్బారావు నూ
సెంట్రల్ ఎక్సైజ్, మేడికొండూరు పుండరీకాక్ష రా
యల్ యల్ యం యన్,బి, హైదరాబాదు. నందూరి
రావు (హెచ్, యం. మిడిల్‌స్కూల్)

భగవానుడు వీరికి ఆయురారోగ్యైశ్వర్యము
చుచూ ఇట్టి సత్కార్యములకు బుద్ధి ప్రసరింప
ఆశీర్వదించుగాత !

---

N. B.- భక్తులు యీ శిశుగ్రంథమాలను తమ శక్తికొలది
గలరని ఆశించుచున్నాము. ఈ అమూల్యగ్రంథముల
తపాలా బిళ్ళలు రు. 0-25 పై. పంపగలరు.

— సర్వేజనాః సుఖినోభవన్తు —